శ్రీ ర స్తు.

శ్రీచెన్నకేశవపరబ్రహ్మణే నమః. 1924

# పౌండరీకము.



శ్రీమద్గద్వాలసంస్థానాధిప, శ్రీమంత, మహారాజా

శ్రీసీతారామభూపాలభూపాలశేఖర

మృగయావృత్తాంతమును దెలుపు నేకాశ్వాసప్రబంధము.

తత్సంస్థానకవియగు బ్రహ్మశ్రీ-మహారాజశ్రీ,

ఆదిపూడి - ప్రభాకరామాత్యకవిచే

విరచితము.

బ్రహ్మశ్రీ,

పండిత, పురాణం - సూర్యనారాయణతీర్థులవారిచే

పరిశోధితము.

ప్రభుతిలకునాజ్ఞానుసారము

గ్రంథకర్తచే



---

మద్రాసు

ఆనందముద్రణాలయమున

ముద్రాపితము.

1924.



శ్రీరస్తు.

శ్రీ కేశవపరబ్రహ్మణే నమః

# పౌండరీకము.





శ్రీమద్గద్వాలపురీ
క్ష్మామండలభారభరణ మాద్యత్సీతా
రామనృపాలకబాహా
క్షేమంకర చక్రధారి కేశవశౌరీ. 1

భక్తవరదుఁడ వీవు నీ భక్తవరుల
కథలు వినుటన సంతోషకరము నీకుఁ
గాన వినిపింతు గద్వాలమానవేంద్రు
పౌండరీకాఖ్యకృతిని ప్రబంధసరణిఁ 2

ఈవు పురాణపూరుషుఁడ వేను పురాతనసత్కవీంద్రసం
భావితమార్గయానలసమానమనోరథుఁడన్ రమేశ నీ
పావనమైన సత్కృపకుఁ బాత్రునిఁగా ననుఁ జేసి వాక్కృతిం
బ్రోవుము సత్కవీంద్రులకుఁ బ్రోపును బ్రాపును నీవ కావలెన్.

సీ. తనబాహుదండంబు ధరణీవధూటికి
శృంగారశుద్ధాంతసీమ గాఁగ
దనయాస్య మబ్జాసనునిపట్టమహిషికి
నింపైనకొలువుకూటంబు గాఁగఁ
దనరాజ్య మారమాతన్వీమతల్లి కం
దంపైననాట్యరంగంబు గాఁగఁ
దనయశఃకాంతికదంబంబు దిక్సతీ
వనవాటికకుఁ గుందపఙ్క్తి గాఁగ
గీ. విపులగద్వాలసామ్రాజ్యవిభవకలిత
లలితసింహాసనుండు కళాకలాప
కవితిలకదివ్యగవిభావభవమనోజ్ఞ
మూర్తి వెలయు సీతారామభూవరుండు.

చ. ఒకదిన మావిభుండు సచి
వోత్తములున్ సుహృదాప్తబాంధవ
ప్రకరము గొల్వ భాగ్యనగ
రంబున నింద్రసభన్ హసించుహా
టకమయకుడ్యగోపురవి
టంకకవాటనవీనరామణీ
యకరుచిరోన్నతాత్మభవ
నాంతరసంసదుపాంగణంబునన్.

చ. కొలువయి యుండి మ్రోలఁ దన
కుం బ్రజ సేసెడువిన్నపంబులం
దెలువము మీఱుచిన్నగవు
చేఁ దులకించెడుమోము చిత్తముం

దలినవనీతకోమలగు
ణంబున కద్దము గాఁగ వించు వా
రలసుఖదుఃఖముల్ మదిఁ బ
రామరిసించుచు నిట్లు వాకొనున్.
ఇభములు సూచి మోసళుల
యింపులు సూచి తదగ్రకేతన
ప్రభలను జూచి వప్రవికి
రంబులు సూచి హయాళి సూచి సౌ
రభమయపుష్పవాటులప
రంపరఁ జూచి భటాళిఁ జూచి యీ
ప్రభువు లదృష్టవంతు లని
పల్కెడుపల్కులు శోచనీయముల్.
ఇందలితత్త్వ మెంతయు మ
హీతలభారము మోయునట్టిరాడ్
బృంద మెఱుంగుఁ గాక ప్రజ
యే మెఱుఁగుం దలపోయ ధారుణీ
చందనగంధితోడ సర
సంబులు రత్నవితానవిస్ఫుర
త్సుందరదండశూకముఖ
చుంబనసౌఖ్యకరంబు లెంచఁగన్.
దిగఁదీసిన గోహత్యయు
నెగఁదీసిన బ్రహ్మహత్య కి యీరాచఱికం
బగునే యిది సౌఖ్యావహ
మగుఁ గా కతికష్టనిష్ఠురాకర మెందున్.

సీ. కరుణించి విడిచినఁ గాతరుం డగుదురు
శిక్షించుచోఁ గ్రూరచిత్తుఁ డండ్రు
ర మ్మన్న నాత్మగౌరవ మెఱుంగఁ డటండ్రు
పొ మ్మన్న నిది యేప్రభుత్వ మండ్రు
త్వరగఁ దీ ర్పియ్య నిదానమే లే దండ్రు
జాగు సేసిన మాకుఁ జా వి దండు
నడిగిన విచ్చిన నవివేకి యితఁ డండు
రీయనిచో లోభి యీతఁ డండ్రు
గీ. ప్రజల మెప్పించి పాలింప బ్రహ్మ కైన
వశము కా దిందులకు సహవాస మయ్యె
నవనిలోనఁ బ్రజాప్రభుత్వైకబుద్ధి
కలిగె గోర్చుట్టుపైన రోకంటిపోటు. 10
ఉ. కాలము మాఱిపోయె ఋషి
కల్పితశాస్త్రము లెల్ల వ్రేల్మిడిన్
వ్రేలుపఁగాఁబడెన్ సకల
వేదములుం జెడె ధర్మమార్గముల్
మూలలలోన డాఁగెను ద
పోమహిమల్ వెస బ్రుంగె నిష్ఠలుం
జాల వినీతిఁ గ్రుంగె నిఁక
సాగుట యెట్లొకొ రాజకార్యముల్. 11
ఉ. ఐనను బుద్ధిమంతు లగు నస్మదమాత్యులుఁ గార్యదర్శులా
స్థానసుధీజనుల్ గలసి సమ్మతిఁ జేయుసహాయసంపదం
బూని ప్రభుత్వధర్మముడి వ్రాఁచరించెద మాదిధర్మసం
ధానము మాకుఁ గేశవుఁడు దైవముసర్వము నిర్వహింపఁగన్.

సీ. మొదలెల్ల నీ రామె ఽ మేరయే లేనట్టి
రాజకార్యములభా ఽ రంబుకతన
వ్యాయామరహితమై ఽ యవయవంబులు పశ
వర్తులు గాక చే ఽ డ్పడఁ దొడంగె
విశ్రాంతి యెఱుఁగమి ఽ వివిధసౌఖ్యంబుల
విసువును నరుచియు ఽ వెగటుఁ దోఁచె
విధి విరామము లేక ఽ విన్నపంబులు సేయు
ప్రజయందనాదర ఽ భావ మొసఁగె
గీ. నిందులకుఁ దోడు వేసవి ఽ యెండ లిపుడు
మండుచున్నవి రవులు పం ఽ డ్రెండుగురును
లేఁచి యొక్కట మింటఁ దీం ఽ డ్రించినారు
కానిచో నిట్టియూష్మతై ఽ క్ష్ణ్యంబు కలదె.
సీ. వేండ్రానఁ బ్రతిలేని ఽ పిడుగులలోహంబు
పోడఁపుదిక్కనుకొల్మిఁ ఽ బాదివి పెట్టి
శేషాహిచర్మభ ఽ స్త్రిక లెస్సగా నూఁది
ప్రథమాద్రికరువుగాఁ ఽ బట్టి పోసి
ద్రాఘిష్ఠగగనశ ఽ తఘ్నిలో దట్టించి
సకలకాండంబు భ ఽ స్మంబు సేయఁ
గాలరాక్షసుఁడు దీ ఽ ర్ఘక్రోధమూర్తియై
ప్రేల్చినాఁ డదె వచ్చెఁ ఽ బెద్దగుండు
గీ. దాన వెడలినసర్వసం ఽ దహ్యమాన
సప్తజిహ్వాగ్రవిషశిఖా ఽ జాలజాత
తాపతప్తంబు లైనస ఽ త్త్వంబు లెల్లఁ
జేతనాచేతనాజ్ఞాన ఽ జాత మయ్యె.

క. ఇట్టియసహ్యాకరం బగు
వెట్టియు మదిలోనివెట్ట వెరవుమొయిం బోఁ
గొట్టఁగ నుపాయ మిం ది
ప్పట్టునఁ జూపెట్టుపుణ్యవంతుఁడు కలఁడే. 15

చ. అనివినయంబుదోఁపఁ బ్రభువాడెడుపల్కులు సావధానులై
వినుసభవారిలోనియొక ప్రెగ్గడలేచి జోహారొనర్చి యి
ట్లనియె నృపాల ధర్మములయందు నృపాలకధర్మమే తపో
ధనులుమహోత్తమంబయినధర్మముగావిధియించి రిద్ధరన్.

సీ. బలవంతుఁడగువాఁడు బలహీను నొంపఁగాఁ
బ్రభువు లేకున్న నెవ్వండు కాచు
జారచోరాదిదుష్కర్ములు బాధింపఁ
బ్రభువు లేకున్న నెవ్వండు మాన్చు
వ్యవహారమిషఁజేసి వర్తకుల్ వంచింపఁ
బ్రభువు లేకున్న నెవ్వండు దీర్చుఁ
గష్టార్జితధనాదికస్వముల్ సెడెడిచోఁ
బ్రభువు లేకున్న నెవ్వండు ప్రోచుఁ

గీ. బ్రభువు లేకున్నఁ గర్షకుల్ వర్తకులును
బ్రాహ్మణుల్ పెరవృత్తులవారు నెట్లు
స్వార్థముల నెల్లఁ గాచుకోఁ జాలువారు
ప్రాణమే కద ధరకు భూపాలకుండు. 17

మ. అదియే రాజ్యము వారెపో ప్రజలు ధ
ర్మాత్ముండు భూపాలుఁ డె
య్యది పాలించునో యెవ్వ రట్టివిభు న
త్యాసక్తి సేవింతురో

యదియుక్ వా రటు కానిచో నది యర
ణ్యం బయ్యెడుక్ వాడు దు
ర్మదపంచాస్యతరక్షుకప్రముఖతి
ర్యక్సత్త్వముల్ భూవరా. 18

ఉ. అన్నిమతంబులుం దనవిశేయట్లుగఁ జూచుచు వృత్తులెల్ల న
భ్యున్నతిఁ గాంచి దేశమున కున్నతసంపద దేర ధర్మని
ష్పన్నత నప్రమత్తుఁ డయి సర్వజనాదరణీయపద్ధతిం
జెన్నుగ రాజ్యమేలునృపశేఖరుఁడాభగవంతుఁడేయగున్. 19

గీ. మీరు సెల విచ్చినట్లు భూభారవహన
మధికకష్టతరంబు దా నయ్యు రాజు
విసువు గల్గినవేళ వివిధవినోద
కలితుఁ డయి చిత్త మిగురొత్తఁ గ్రాలవలయు. 20

గీ. విద్య విశ్రాంతి యిడు విప్రవితతి కెల్ల
ద్రవ్య మొడఁగూర్చు దానిఁ గిరాటతతికి
నవరజులు పొందుదు రది సస్యములవలనఁ
గాని రాజులవిశ్రాంతికథలు వేఱు. 21

సీ. ఒక్కొక్కతఱి గాయకోత్తమగానసు
ధాసారముల నోలలాడుకతన
నొక్కొక్కవేళ రంభోరునృత్యకళాత
రంగమాలికల మునుంగుకతన
నొక్కొక్కయెడఁ గవీంద్రోదారకవితార
సాయనంబును జూఱలాడుకతన
నొక్కొక్కసారి మహోత్సాహజనకని
జోదంతములు విని యుబ్బుకతన

గీ. నొక్కపక్షి వేట దూ్యత మొక్కొక్కయెడను
దవ్వులుకలేమునఁ జిత్తానఁ దవిలి యున్న
యుత్తలంబును బోఁద్రోయు నురవు పతికిఁ
గాని యొండేనిఁ దీఱనికాంక్ష తగదు. 22

చ. అలమటఁ జెంది యున్న హృద
యంబు శరీరము రెండునున్ మృగ
వ్యలలితఖేలనంబున ని
వారితజాడ్యభరంబులై కడుం
జెలఁగు వసంతుఁ డిందులకు
సేవకునట్లు సపర్య సేయుఁ గో
యిలలు తలారులై యనున
యించెదు వింటివె భూపచంద్రమా. 23

సీ. కారువానలు కావు కమ్మవిల్తునివింటి
వలనఁ దొరంగుపుష్పములు కాని
యెండవేండ్రము కాదు మృగలాంఛనునినిండు
వెన్నెల యెసకొల్పువెట్ట కాని
పికభాషితము గాదు వేల్పుఁబడంతుల
గౌరికల్యాణసంగతులు కాని
యళిఝంకృతులు కావు యక్షులు వాయించు
భవ్యతూర్యములనిస్వనము కాని

గీ. యన్నియును మీకు భావికల్యాణసూచ
కములు కన్పడె సమయధర్మములమిషను
విజయలక్ష్మీసమాశ్లేషవిభవకలిత
లలితపద మబ్బు మీకు నిలాతలేశ. 24

చ. పిలిచినఁ బల్కు బెబ్బులులు
పిల్వకయే చనుదెంచుఁ గాఉపో
తుల తెగ మందమందలుగఁ
ద్రోవలు కట్టి తొలంగ వేకలం
బులు తెగఁ గ్రొవ్వి గ్రుడ్డెలుఁగు
మూఁకలు నెందును దామెయై పొలం
బులఁ జరియించు భూపకుల
భూషణ యీతటి లెస్స వేఁటకున్. 25

ఉ. మున్ను ప్రతాపరుద్రుఁడు ప్ర
భుత్వము సేసినచోటు బుద్ధిసం
పన్నుఁ డమాత్యశేఖరుఁడు
మంత్రియుగంధరుఁ డున్నచోటు న
భ్యున్నతి నాంధ్రభూమి వొగ
డొందినచోటును నోరుగల్లు నా
సన్నతి గన్నచోటది ప్ర
శస్తము మీామృగయాప్రస క్తికిన్. 26

చ. ఇరువదికోసు లేఁగిన మ
హీవర మొల్గనుపల్లె యుండుఁ గాఁ
పురముగఁ దానిచుట్టు మృగ
ముల్ దెగఁ గ్రొవ్వి చరించుఁ గాన ద
త్పరిసరమందునే మన మ
వశ్యము నిల్చిన వేఁట లెస్సగా
జరుగును కాన వేగ దగు
సన్నహనంబున కాన తీయుఁడీ. 27

చ. మన కనుకూలుఁ డైనయుజ
మానుఁడు మాన్యుఁడు బాదుషాహి మ
న్ననఁ బరమాన యిచ్చెను ఘ
నం బగుమీమరియాదపొంటెఁ ద
ద్వనమున వేఁట సేయ నర
వాయి యిఁకేటికి వేగ మంచి దా
దినమును జూచి సైనము వి
ధింపుఁడు మీకు జయంబు చేకుఱున్. 28

మ. అని యాఖేటవిహారయత్నమున కా
త్మామాత్యులం దొక్కరుం
డనుకూలంబుగ నిట్లు చెప్పటయు రా
జాయుక్తియుక్తోక్తి క
త్యనుమోదించుచు రాజకార్య మనివా
ర్యప్రక్రియం దీర్ప నే
ర్చినమంత్రిజ్ఞుని రాజధాని నియమిం
చెం గార్యనిర్వృత్తికిన్. 29

ఉ. అంతట సాగె వేఁటకు న
హర్నిశముల్ దుది లేక నాకప
ర్యంతముఁ గ్రాలునిచ్చెనలు
నంతకు మించినయుయ్యెలల్ దిశా
ప్రాంతము లాకళించువల
లంతకు మీఱునురుల్ మహోగ్రకా
లాంతకసామ్యలుబ్ధకచ
యంబును గూర్చుమహాప్రయత్నముల్. 30

సీ. మోటుబండ్లెఱుఁగని మొప్పెమూఁకల కెల్ల
మోటారుబండ్లెక్కి మురియు రేఖ
రైలుపేరెఱుఁగని దాంభల కలస్వప్న
లెక్కి గర్వించు నదృష్ట రేఖ
యఁబలే యెఱుఁగని యన్నాతురుల కెల్ల
మృదుమధురాన్నముల్ మెసవు రేఖ
గడ్డియా వెఱుఁగని యెడ్డెజంతువులకు
లడ్డుమేవాల్ మేయు దొడ్డ రేఖ
గీ. మంచినీరే యెఱుంగని మందులకును
కలరుసోడాలలో మున్గు గట్టి రేఖ
బయలువెట్టె సీతారామ పార్థివేంద్రుఁ
డసదృశాఖేటఖేలనా వ్యాజమునను. 31

సీ. స్నానశాలలును భోజనశాలలును బాక
శాలలు శీతోపచార యోగ్య
శాలలు శయనార్హ శాలలు విశ్రామ
శాలలు పరిచర శాలలు హయ
శాలలును శతాంగ శాలలు నాటక
శాలలు దీపికా జాలయంత్ర
శాలలు భండార శాలలు సైనిక
శాలలుం వివిధవి శాలశాల
గీ. లందఱకు వారివారి యోగ్యతనుబట్టి
విడుదులేర్పడ్డె వర్తక వితతి వచ్చె
మొల్లుప్రభ హెచ్చె గద్వాల భూమిపాలు
నసదృశాఖేటఖేలనా వ్యాజమునను. 32

సీ. గుఱ్ఱాలబండ్లు నే§న్గులు లొట్టియలు నెడ్ల
బండ్లును మేనాలు § బరువుకచ్చ
డంబులు మఱి వేస§డంబులు రేకలాల్
చకడాలు జటకాలు § స్వారిబండ్లు
బైస్కలుల్ ట్రైస్కలుల్ § బస్సులు మోటారు
కార్లును మొగలాయి§తేర్లుఁ బల్ల
కీలు టాంజాను లా§దాలు నంబారీలు
నను పెక్కుపేర్లఁ బే§రొక్కనినవాహ
గీ. నములపై వచ్చి డిగియె న§సంతములుగ
సాధనోత్కరసామగ్రి§సంచయంబు
భటవితానముఁ బలివార§పటలి భూమి
యీనిన ట్లయ్యె శ్రీహరీ § యేమి చెప్ప.
సీ. రోల్డప్పు స్లీవ్సు ష§ర్టును వేసి మోఁకాళ్లు
దిగని బ్రీచస్సు బం§ధించి కట్టి
గడ్డాన బిగిఁచిన§కాకిహ్యాటును బెట్టి
హోసులపై బూట్సు § లుంచి కట్టి
మోయలేనితుపాకి§మోపు మూఁపునఁ బెట్టి
కందగడ్డమొగంబు § గంటు వెట్టి
యఱిగోఱిగిన మీస § లెఱడా లెసంగఁగా
సచ్చంపుదొరగారు § వచ్చినట్లు
గీ. నగవు నగినప్డు దెసలు వ§ణంకుచుండఁ
దుఱక మింగ్లీషుఁ దెనుఁగు సం§కరము గన్నిన
వాగ్విడంబన మొప్పఁగా § వచ్చి చేరె
నొక్కసరదారు చూపఱ § యులికిపడఁగ.

శా. బాజాల్ మ్రోయఁగ వచ్చెఁ దేరుపయి గో
పాల్పేటసర్దారుఁ డ
వ్వాజీకీ డయినట్టిబుద్ధిబలసం
పన్నుండు శూరుండు న
వ్యాజోదారపరాక్రముండు నరసిం
హారెడ్డి యాఖేటవి
భ్రాజత్కౌతుకలంపటుం డగుచు శ
స్త్రప్రౌఢి దీపింపఁగన్. 35

శా. తిమ్మారెడ్డియు శేషరెడ్డి యనుభ్రా
తృద్వంద్వ ముద్వేలశౌ
ర్యమ్మాకారముఁ దాల్చెనో యనఁగ శ
స్త్రప్రౌఢి మీఱంగ వై
శమ్మెంతెంచిరి పెండ్లివిందులకుఁ బి
ల్వంబడ్డచుట్టాలభో
గమ్ముల్ సూపుచు మందహాసకలికా
క్రాంతాననాంభోజులై. 36

. మఱియు నాత్మకూరుముఖాసాదారుండగు ధర్మారెడ్డిదేశపాం డ్యుండును, దాలూకాదారుండగు నుబేదుల్లాసాహేబును నా బకారీమొహ్తుమీామగు రంగారెడ్డియు మఱియు నితరసర దారులును వారివారిదళంబులతో నచ్చటచ్చట గుమిగూడి ప్రభునెదుర్కొని స్వాగతం బొసంగుసంబరంబున ననేకమం గళవాద్యంబులతో నెదురువేచియుండిరి. ఈమృగయావి హారవీతూకౌతుకంబునఁ జనుదెంచి యితర మిత్ర బంధుజ

నంబును నిండుముదంబునఁ బ్రభురాక యెప్పుడెప్పు డ
నిరీక్షించు చుండి రంత.

శా. సారోదారపరాక్రమార్యముఁడు రా
జా రామచంద్రక్షమా
ధౌరంధుర్యుఁడు మేనబావ తనయొ
ద్దం బ్రీతిఁ గూర్చుండి కాం
తారావాసమహోగ్రసత్త్వచయత
త్త్వంబుల్ ప్రసంగింప నీ
తారామావనిపాలుఁడుర్ డిగియె నం
తర్ వైభవప్రోపేతుఁడై. 3

సీ. ఎత్తియుంచినవిచ్చుకత్తులచకచకల్
దనబింబకాంతుల నినుమడింప
రౌతులసన్నఁ గరాళించుహయహేష
తనవాహతతికిఁ బ్రోత్సాహ మొసఁగ
నాతతకరికరోద్ధూతశీకరములు
తనసారథికిఁ జల్లఁదనముఁ గూర్ప
వామలోచనలనివాళిపళ్లెర మాత్ర
రాజ్య మేకైకచక్రంబు సేయ
గీ. జనులు పతి కిడ్డస్వాగతోత్సవము తనకు
నింత యుపకార మొడఁగూర్చునే య టంచు
మెచ్చి తనవేంద్రమును విరమించి యేఁగె
మిహిరుఁ డపరమహీధ్రసమీపమునకు. 39

మ. అపు డధ్వారచితశ్రమాపనయయోగ్యస్నానపానాదనా
ద్యుపచారక్రియ లెల్లఁదీర్చికొని రాజోత్తంసుఁడుర్ బంధుమి

త్రిపరివారముహృద్యవాద్యముఖసద్యఃప్రవృత్తలీలావినో
దపరిశ్రాంతిఁ జెలంగఁ దోఁచెసుధాఽధాముండుప్రాగ్దిక్కునన్.

మ. నను దోషాకరుఁ జేసి పాంథజనమఽన్యాయంబుగాదూఱుచే
మినిమిత్తంబుప్రదోషహేతువదియేఽమీయీగురుఽశుక్రసౌ
మ్యునిమందుంగుజరాహు కేతువులవాఽజ్ఞాలంబుతోడర్ విమ
ర్శనసేయుండని నిల్చెఁగట్టెదుటఁ జాఽరాభర్త భూభర్తకున్.

తే. ఈపని యిప్డు కాదు పదిఽయేనుదినంబులమీఁద వెండియుం
జూపుము సాక్షివర్గ మనిఽచోద్యముగా శయనంబు సేరె క్షో
ణీపతి, యంత ఖిన్నుఁ డయిఽ నీరజవైరి నిరాశ మోమునం
దోఁపఁగఁబశ్చిమంబరిగెఁఽడోడన వెల్వెలఁబాఱెఁదారకల్.

ప్రజలార గద్వాలఽపార్థివేంద్రుఁడు మేలు
కొనియె సందర్శనఽమునకు రండు
సురలార మీరు మీఽకఱవు తీఱఁగ మంచి
భక్ష్యభోజ్యములు సాఽపడఁగ రండు
పుండరీకములార ఽ పురి మీ రొనర్చిన
పాపముల్ పరువుగాఁ ఽ బండె రండు
బీదసాదలు మీరు ఽ బిగిసినపొట్టలు
ప్రిద్దుంగఁ దినవచ్చు ఽ వేగ రండు
రండు రండోయి రండు బిఽరాన లెండు
నిండు మీనిండుకోర్కులు ఽ నేఁడ టంచుఁ
గూయఁదొడఁగెను గాఁపిండ్లఽకొప్పు లెక్క
యందఱు వినంగఁ బురిఁ జరఽణాయుధములు.

ఉ. అంతటఁ దెల్లవాఱెఁ బ్రజలందఱు మేల్కొని రంత మేదినీ
కాంతుఁడు లేచి నీస్మరణ క్రగాలఁగ నిత్యవిధిప్రకాండ మ
త్యంతదృఢప్రయత్నుఁడయి సాంతముగా నెఱవేర్చి క్షేమవృ
త్తాంతపురస్సరంబుగ యథావిధి నందఱఁ దేల్చెనాదృతిన్.

సీ. పాళెంబులోనఁ గావలసిన సామగ్రి
సముదాయమును గూర్చ జతనమునకుఁ
బోతులు కట్టి బెబ్బులులు చొప్పడి యొప్పు
నెలవులు కనిపెట్టి తెలుపుటకును
తెరువులు కట్టి బిత్తరిజంతువులు మాటు
సూటిగాఁ జేరంగఁ జోపుటకును
నిచ్చెనల్ గూర్చి బంధించి మ్రాఁకులమీఁద
మంచె లుయ్యెలలు కట్టించుటకును

గీ. వేలువేలుగ సరదార్ల వేఁటగిరుల
మంచియనుభవ మున్న యామ్లాజనముల
మేటిసాహసికులను నేమించె ఱేఁడు
నాఁడు జరిగెడు వేఁటసన్నాహమునకు. 45

శా. మధ్యాహ్నోచితనిత్యకృత్యచయముల్ కత్ష్మా దేవసంతర్పణల్
విధ్యుక్తంబుగఁదీర్చి తుష్టిఁగని యుర్వీభర్త యంతః దివా
కోద్యాతవ్యభవత్పదాబ్జయుగళీగుంజద్విరేఫాయితా
త్మాధ్యానుండయి వేఁటకై వెడలె నుద్యచ్ఛస్త్రసన్నద్ధుఁడై.

సీ. నిడుదకొమ్ములు సాఁచి నిక్కి పూవింటివా
నికిఁ బూలగుత్తులే నేర్చు మ్రాఁకు
లా మ్రాఁకులకు విరహాఁపుబాధ వారింపఁ
గౌఁగిట బిగియించి క్రాలులతలు

నాలతావితతికి నాశ్రయం బొడఁగూర్చి
పొంగారువల్లీకుడుంగచయము
నాకుడుంగములఁ బుష్పాస్త్రసంగరలీల
లలవరించుకొనువన్యయువమిథున
గీ. మామిథునమున కలమట నపనయించి
యనితవిశ్రాంతి యిచ్చుజలాశయముల
తీరములఁ గల్గి యొప్పుకాంతారభూమి
విభుఁడు విహరించి విహరించి వేఁటతమిని. 47
చ. వకుళ రసాల బిల్వ వటపాటల చందన కర్ణికార నిం
బక కరవీర విద్రుమ తమాల కపిత్థ శమీ కదంబ చం
పక పన సామ్ల పూగ శతపర్వ మధూక విభీతి కామ్ర కిం
శుక కురువింద నాకులిక శోణముఖద్రు వికీర్యమాణ మై. 48
శా. ఘోరం బై బహుళాంధకారనిబిడక్ష్మాధ్రగుహాక్రాంత ది
గ్వారం బై వనసూకరోన్నమితజంబాలావృతాసార కా
సారం బై భయకృన్నృగాదన మహాసత్త్వోత్కరాజస్రసం
చారం బై వివిధోగ్రజంతుకులగర్జాత్రస్తపర్జన్య మై. 49
క. అంచెర్ల యనెడునడవి స
మంచితగతిఁ జేరి యచట నాత్మప్రజలం
గాంచి విశేషము లేమన
నించుక శిరములను వాంచి యిట్లని రెలమిన్. 50
ఉ. దేవర యాలకింపుఁడు మ
దించి నెమిళ్ళలఁ గూయఁ జొచ్చె; నా
క్రేవల నందె యున్నది, య
రిందమ, వ్యాఘ్రము, రాత్రి పోతు నం

దే వధియించెఁ గూళ మొక,
మింతియు నిశ్చయ; మట్లు గాన మీ
రీవిటపాగ్రసీమ వసి
యింపుఁడు బెబ్బులి వచ్చు నింతలోన్

మ. అని నిశ్రేణికఁ జూపి వేఁడిన మహా
హ్లాదంబుతో నెక్కి య
జ్జనపాలాగ్రణి తూర్పుకొండ రవియో
జం బొల్చెఁ, దద్భూరుహా
గ్రనివేశంబునఁ దత్సమీపమును జే
రఁగ వచ్చి కూర్చుండె నో
య్యనఁ దద్భావుక రామచంద్రనృపశీ
తాంశుం డనూనప్రభన్.

మ. అనుకూలం బగుభంగి నిప్పగిది వీ
రాగ్రేసరుం డైన య
జ్జనపాలుండు సభావుకుం డగుచు హా
స్తన్యస్తశస్త్రాళిసం
జనితోత్సాహుఁడు బాహుదర్పబలవి
స్తారుండు నై మ్రానిమా
టున శార్దూలవిపాటనక్రియకు నా
టోపించి యున్నంతటన్.

ఉ. తక్కినవారు వారి కుచి
తం బగురీతిని జుట్టుముట్టునుం
బ్రక్కల నున్నమ్రాఁకుగమిఁ
బ్రాఁకి నిశాతకృపాణపాణు లై

దిక్కుల నిక్కుచుఁ జూచు మృగది
దృక్కు, మహోత్కలికాంతరంగ స
మ్యక్కలితాంతరంగు లయి
మాటులు కాచిరి పోటుమానినుల్. 54

ఉ. నేను నిరాయుధుండ నయి
నీపదపద్మము లొండు దక్క నెం
దేనియు దిక్కు గానక య
డే యొకపల్లకి యుంటఁ జూచి నీ
వే ననుఁ గాచినాఁడ వని
యే డ్తెరఁ జొచ్చి కవాటపఙ్క్తి శీ
ఘ్రాన బిగించి దక్కె నికఁ
బ్రాణము లంచటు సూచుచుండఁగన్. 55

చ. పదినిముసంబు లేనిఁ గడ
వంబడ; దే మికఁ జెప్పువాఁడ! నా
యెదుటన నిల్చె నూఱడుఁగు
లేనియు దూరము లేక వ్యాఘ్రము, మ
య్యది మొగ మెత్తుసొంపు, మఱి
యాడెడునింపును, జౌకళించి పెం
పొదవఁ జరించు తెంపు, మది
కుత్సవ మెచ్చుగ మచ్చుఁ గొల్పుచున్. 56

సీ. కప్పు దీర్చినసోఁగకెకన్నులు నిండారఁ
దెఱచి యొక్కొకసారి దెసలు సూచు
గుండ్రంపుపెంగము దిక్కున నెత్తి తెల్లని
సటల నొక్కొకసారి జడియఁ జఱచు

ఉ. ఇవ్విధ మైనచోఁ బులి జ
యించుట సాధ్యము కాదు; వేయువా
రెవ్వరొ నాకుఁ గొంతదడ
విచ్చి పదంపడి వేయు టొప్పు; నిం
కివ్విధి యాచరించునది
యెల్లరు రేపటినుండి; యంచు న
ప్డవ్వసుధావరుండు దివి
యం బనిచెం దనవీడు సెచ్చెరన్.

చ. ప్రథమదినప్రయత్న మొక
భంగిఁ జనెం గద చింత యేల నీ
ప్రథ కనుకూల మైనటు ధ్రు
వంబుగ నెల్లి జయంబు గల్గు; మ
త్కథితవచఃప్రమాణము వి
ధాయక మంచు నెఱుంగఁ జెప్పి స
త్ప్రథమున భానుఁ డస్తగిరి
వంకకు ప్రాలెఁ బ్రశాంతమూర్తి యై.

సీ. నవనీతరుచులు గన్నడ సేయువలిపెంపు
గరగరగాఁ గరాకట్టుతోడఁ
బసుపుఁబచ్చనిచీనిపట్టుపైఠాణంపు
సొగసంచుసరిగకంచుకముతోడ
దోరదోరని కుసుంబారంగుపస మించు
పైఁటవేసినవల్లెవాటుతోడఁ
బాటలీప్రసవసంబంధిమాలాజాల
లలితోరువక్షఃస్థలంబుతోడ

గీ. వఱలుసంధ్యావధూటి గద్వాలవిభుని
కారతి యిడంగఁ బసిఁడిపళ్ళెంబు పూని
వచ్చి నిల్చినభంగి భాస్వంతుబింబ
కలిత మై యొప్పె నపరదిగ్భాగ మపుడు. 66

సీ. యామ్యదిఙ్ముఖభైరవాననవిన్యస్త
కాష్ఠోజ్జ్వలద్దీపికాయుగంబొ
సంధ్యావివాహావసరసమావేశిత
భారయష్టిస్వర్ణభాండయుగమొ
భర్గసేవావేశపరచండచండీశ
తాండవోచితకాంస్యతాళయుగమొ
భాస్కరశశిభూవిభాగపరిష్కార
పరికరాయతతులాపాత్రయుగమొ

గీ. యనఁగఁ బూర్వాపరాశలయందుఁ బొలిచె
నిందుబింబంబు నినబింబ మింతలోన
నొకటి యెగఁబ్రాఁకె, డిగఁగ్రుంగె నొకటి, కాల
శకట మొరగాలుపడె ననుశంక దోఁప. 67

చ. దివిసినవీడు నప్పు డరు
దెంచి సుఖంబున వీడు సేరి, రా
త్రివిధులు తీర్చి, లెస్స నిదు
రించెను; భూవరుఁడున్ యథోచిత
వ్యవహితవర్తనాదికము
లందు నిశీథముఁ బుచ్చె; నిట్టు ల
ద్దివసముఁ దీఱె రాత్రియు గ
తించెను దెల్లఁగఁ దెల్లవాఱుచున్. 68

సీ. స్వర్ణదీక్షేత్రసంస్మరణపూర్వకముగా
　　　స్వచ్ఛోదకముల మజ్జనము సేసి
కేశవనిర్మలాంఘ్రిధ్యానధీయుక్తి
　　　మంత్రసంపూతనామంబు దిద్ది
నిజగృహదేశికానీతవిష్ణుపదాబ్జ
　　　విమలతీర్థంబులు స్వీకరించి
ధరణీసురవ్రాతదత్తమంత్రాక్షతల్
　　　సవినయభక్తి శీర్షమునఁ దాల్చి
గీ. శాకసూపాజ్యభక్ష్యభోజ్యములు హేమ
భాజనోపాహితములు సాపడి విభుండు
కొలువుకూటంబు సేరి మిత్రులును, బందు
గులును, నధికారులును గొల్వఁ గొలువు తీర్చె. 69

వ. ఇట్లు జగదేకసుందరం బగుసభామందిరంబున దేవమంత్రిం బోలుమంత్రులునుఁ, గవిం బోలుకవులును, లోకబంధుం బోలుబంధువులునుఁ, గౌరవమిత్రుం బోలుమిత్రులును, బలసి కొలువ మహేంద్రుచందంబున మహీంద్రుం డొప్పుచున్నంత నానాఁటివేఁటకయి తగుసవరణలు సేయఁ బనిగొన్నసరదారులును, మృగయులును మరలి వచ్చి సార్వభౌముం దగుతెఱంగునఁ గాంచి కేల్దోయి యౌదల ఘటియించి నమ్రులై యిట్లనిరి. 70

శా. దేవా! దేవరపంపునం జని, వనీ
　　　దిక్కోణముల్ సొచ్చి, స
త్త్వావాసంబులు గాంచి, వానిని నిరా
　　　యాసంబుగా వేయఁగా

తావుల్ సేసి సమస్తముం దమకు వే
డ్కన్ విన్నవింపన్ భవ
త్సేవాధుర్యుల మేఁగుదెంచితిమి పృ
థ్వీకాంత! యాలింపుమా. 71

సీ. రామప్పపేర వి॥రాజిల్లు నొక తటా
కం బుండు రెండు క్రో॥శంబులందు
దాని కుత్తరదిశ ॥ దట్టమై యొకకోన
కలదు నానాజంతు॥నిలయ మగుచు
నాకోననడుమ ఘో॥రాకార శార్దూల
మొకటి నరామిష ॥ మొకఁడు దక్క
నితరంబు నొల్లని; ॥ దింపుతో వసియించు
చున్నది సంసార॥యుక్త మగుచు
గీ. దానివలనిభయంబునఁ ॥ దల్లడిలుచుఁ
గాఁపుప్రజ సేద్యమే మాని ॥ కంట వత్తిఁ
బెట్టుకొని యాంధ్ర బిడ్డల ॥ విడక కాచు
కొనుచు నున్నారు కూటికిఁ ॥ గొదవపడుచు. 72

క. తీంద్రించి వ్యాఘ్రము మడవిం
గోంద్రించినఁ జాలుఁ బ్రజల॥గుండెలు నీ కై
వేంద్రానఁ గరఁగు మీా రీ
జేంద్రంబును నేఁడె తొలఁగఁ॥జేయుఁడు దేవా. 73

ఉ. మాటలచేతఁ గార్యములు,
మంత్రములన్ ఫలముల్ లభించునే?
వేఁటకు దండిమానిసులు
వేలకొలందిగ వచ్చి పోయి, రే

ౘ్రేటును లక్ష్యపెట్టక చ
రించెడు మాటుల మాటు సేసి యా
మోటుమెకంబు; దానిని స
మూలము నంపి యసంబు పొందుమా. 74

సీ. చెట్టుచెట్టును బరీక్షించి పంచాణంబు
వారు మాటులు కట్టినారు దేవ !
గొందుగొందులును గన్గొని వేఁటబోయులు
దారుల నరికట్టినారు రాజ !
మూలమూలలు లెస్స పుణికి బెస్తలు వలల్
నాణెంబుగాఁ బన్నినాఁడు ఱేఁడ !
సందుసందులు చోపి జంతువుల్ పఱప స
ర్దారులు వేచియున్నారు సామి !
గీ. కాళ్ళు మ్రొక్కెద మయ్య వేగాన లెండు
తేరు కట్టాయితం బయ్యె దివ్య మయిన
శకునములు దీర్చుచున్నవి జాగు వలదు
పులులు వడు నేఁడు నిక్కంబు భూపతిలక. 75

*　　*　　*

స్రగ్ధర. అని వ్యాఘ్రాఖేటసన్నాహసకలచరితం
బంతయుం దెల్పఁగా స
జ్జనపాలుం డంత సంతోషభరవికసిత
స్వాంతుఁడై లేచి దీనా
వనదీక్షుం డైన మై సత్వరితగతి వస
స్ప్రాంతముం జేరె నుద్య

ద్ఘనమేఘధ్వానధీధిక్కరణచణశతాం
గస్వనం బుప్పతిల్లన్. 77

సీ. కోఁతకు సిద్ధమై కొల్లగాఁ బండిన
పరిపరివిధముల వరిపొలములు
నాపొలంబులలోన నతినిర్మలంబుగాఁ
బ్రవహించుచున్నట్టి పంటకాల్వ
లాకాలువలగట్ల యందు లెస్సగ మేసి
బలుపుమై పన్నుండు పసులమంద
లామందలను గాయు చచ్చటచ్చట సర
సాలఁ దేలెడు గోపబాలికలును

గీ. చుట్టుముట్టులుఁ బెక్కు గ్రోసులకొలంది
గలిగి కాఁపులపాలిటి కామధేను
వనఁగ నెందును దఱుగని యట్టినీళ్ళ
లొప్ప వెలయుచునుండు రాయప్పచెఱువు. 78

గీ. గట్టులే చుట్టుఁగట్టలు గాఁగఁ గ్రాలు
నాచెఱువు దాఁటి యటువైపు నందు నున్న
బుడపలకు మధ్యభాగంబు గడచి గండ్ల
రూఢపథమున డంయమారూఢుఁ డగుచు. 79

చ. మనుజవిభుం డరణ్యము క్ర
మంబునఁ జొచ్చి చనం జనన్ మృగా
దనములు భల్లుకంబులును
దర్పితదంష్ట్రచయంబునున్ లులా
యనికర మంతకంతకు భ
యావహమై కడు సంచరించు కా

నన మతిగాఢ మై యటఁ గ
    నంబడె ఘోరతమఃప్రకీర్ణ మై.

గీ. దాని టొకుటొంకు లేక భూమిధవుఁడు సొచ్చి
మృగయు లచ్చట నొకప్రమానిమీఁదఁ దనకు
నేర్పఱిచి యున్నగద్దియ నెక్కి నాల్గు
దెసలుఁ గన్గొని యుల్లాస మెసక మెసఁగ. ౬

క. తమ్ములను బంధుహితబృం
దమ్ములనుం దమకు సమ్మత మ్మగుతరుజా
తమ్ముల నునిచినపలుచం
దమ్ములనెలవులకు నతిముదమ్మునఁ బనిచెన్. 8

చ. పనిచిన వారు వారికయి
    పన్నినమాటులు సొచ్చి సజ్జశ
స్త్రనికర మొప్పుచుండఁ గనుఁ
    బ్రామక యుండిరి చూచు చిట్టు ల
జ్జనపతి సర్వసన్నహన
    సంకలితుం డయి సన్న సేయుదుర్
జని రటు వేఁటకాంద్రు వన
    సత్వములం బురికొల్పి చోపఁగాన్. 83

చ. జగములు తల్లడిల్లఁ బరు
    షధ్వనిఁ గో యని కూయుకూఁతలన్
నగములు తూఁటు వో నటు ఘ
    నంబుగ మోఁదెడుడప్పుమ్రోఁతలన్
మృగయులు డొంక లంటి బెద
    రించుచుఁ గోలల వ్రేయువ్రేఁతలన్

దెగఁబడి జంతువుల్ సెదరి
దిక్కులఁ బాఱెను గాందిశీక మై. 84

చ. కలుగులు దూఱి పోవునవి
కంపలు తెంపున దాఁటునవ్వియుఁ
బిలబిలఁ బాఱి వచ్చునవి
బెగ్గిలి దిక్కులు సూచునవ్వియుఁ
దొలఁగి చరించునవ్వియును
దుండఱికంబున రొప్పునవ్వియుఁ
జెలఁగి మృగంబు లయ్యడవిఁ
జిందఱవందఱ యయ్యె నందడిన్. 85

వ. అంత.

శా. సారించుఁ వెస డించుఁ గార్ముకము ల
క్ష్యంబుం బరీక్షించుఁ గాం
తారాభ్యంతరసీమఁ జూడ్కి యిడి చి
త్రంబుల్ విలోకించు నే
దారిఁ వచ్చునొ వ్యాఘ్ర మంచు మదిఁ జో
ద్యం బొప్ప యోజించు ని
ట్లారాజన్యశశాంకుఁ డుండ వినఁగా
నయ్యెఁ మయూరధ్వనుల్. 86

సీ. ఆరీతిఁ గర్ణరసాయనంబుగ షడ్జ
మశ్రుతి కెలుఁగులు మంజులగతిఁ
గలిపి పాడెడునీలకంఠంబులవిరావ
మాలించి నృపుఁ డది యరుగుదెంచు

దెసఁ జూడ్కిఁ బఱపి యద్దెసఁ గాంచె నల్లని
మోములునుం జుట్టుముట్టుఁ దెల్ల
గడ్డముల్ నిడుదతోఁకలు గల్గి యెగురుచు
వచ్చుచున్నట్టిప్లవంగ సేన;

గీ. దాని వెనుదన్ని చిత్రచిత్రముగ వచ్చె
గునిసి యాడుచుఁ గొన్ని యెగురుచుఁ గొన్ని
నెమిళు లతిరమ్యవర్ణపింఛములతోడఁ
జూచువారికి మిక్కిలి చోద్య మెసఁగ. 8

గీ. వ్యాఘ్రరాజున కిది సేన యనెడువారు,
వచ్చు నామాట వినుఁడని పలుకువారు,
ప్రేలకుఁడు వచ్చె నని హెచ్చరించువారు,
నగుచుఁ బరిచరు లలవాలుసా రగుచు నుండ. 8

సీ. వన మొల్లఁ గలఁచువిప్లవముచేఁ జెడినట్టి
గాఢనిద్రాబద్ధకంబు గొంత,
రాతిరి మెసవినపోతుమాంసము పొట్ట
మందగించుటఁ గల్గుమగత కొంత,
పన్నుంటచే వసపడక సాగమిఁ గాళ్ళ
నడవనీయనికారణంబు కొంత,
పండ్లలో నిఱికినపలలంబు విద్రిచిన
రాకకుఁ బొడముచిరాకు కొంత

గీ. సహజ మైనట్టితనరాజసంబుఁ బెంప
రాజఠీవి యెసంగ వ్యాఘ్రంబు నడచె
నడుగులో నడ్గు వెట్టుచు నావులించు
చాత్మ వెగ టేచి చిఱ్ఱుము ఱ్ఱాడుచుండ. 8

గీ. ఇట్లు నెమిళులు కూచి వా§యించుచుండఁ
బ్లవగసేన యరబ్బుల§పగిది ముందు
వక్రవాచావిహారత§త్వరత నడువ
వచ్చెఁ బులిరాజు ప్రాఁతన§బాబుపగిది. 90

గీ. వచ్చి ప్రభునకు డాపలి§ప్రక్క నున్న
తెఱపివనమునఁ దచ్చాడి § తిరిగి ముంద
అడుగు వెట్టినయంతలో § నవనిభర్త
బారు సవరించి విడిచెఁ దు§పాకిగుండు. 91

చ. వలపలిడొక్క చీల్చి, బల
వంతముగా జఠరంబు సొచ్చి, ప్రే
గుల నొకకుప్పఁ జేసి, బలు
గుం డది బెబ్బులి బిల్కుమార్చె; తె
ప్పలు వెస ద్రావులనంతటనె,
బాపురె! దాని ప్రభావముఁ మహీ,
తలవరులత్యభేదనము,
పాండితి, యెట్టిదో కాని కేశవా! 92

గీ. మొదటిదెబ్బకె యొకమూల్గు § మూల్గి మొకము
మొగ్గ వేసినచందాన § ముందల ఝుడి
చాఁపకట్టుగఁ బడె రామ§చంద్రనృపుఁడు
రెండవది యేయుఁ డని తీవ§రించె నంత. 93

ఉ. నమ్మఁగరాదు బెబ్బులిగు
ణం బిఁక బావసిఫార సేల వ్య
ర్థమ్ముగఁ జేయు టంచు భిదు
రప్రతిమ మ్మగుబారుఁ జేర్చి తీ

ప్రమ్ముగ వేసి రెండవది
"వ ద్దిఁక వ ద్దిఁకఁ జచ్చె" నంచు వృ
క్షమ్ములమీఁదనుండి సహ
జమ్ములు మిత్త్రులు నార్చుచుండఁగన్. 9

శా. ఆయార్పుల్ వన మంతయుం గలఁగఁ జే
యం జూచి తద్వ్యాఘ్రరా
డాయాపత్యయుగంబు నాసరస ని
చ్ఛన్ వచ్చుచున్నట్టి; వీ
చాయన్ వీడి మఱొక్కదిక్కున నదృ
శ్యం బయ్యె మంత్రించిన
ట్లాయుర్దాయము కల్గియుండ నవి యే
లా వచ్చు నీజాడకున్. 9

సీ. వ్యాఘ్రరాజం బిటు వధియింపఁబడుటయుఁ
దత్కళత్రమును బుత్త్రద్వయంబు
నట్లగుటయును మహారాజు తిలకించి
యానాఁటి కిఁక వేఁట యంత మైన
దిగ నెంచి మాటులు దిగ నియమించిన
దిగినవారును నింక దిగెడువారు
నగుచుండ రివ్వన నరుదెంచె నరిముఱి
కొదమబెబ్బులి యొండు గోండ్రు మనుచుఁ

గీ. గన్ను లవి గావు విస్ఫులింగములు గాని
బొబ్బ లవి గావు పిడుగులదెబ్బ గాని
సటలు కా వవి కాలపాశములు కాని
మృత్యువే కాని యది యొక్కమెకము కాదు. 96

గీ. తండ్రి వధియింపఁబడినవిరోధంబు సూచి,
తల్లియును దమ్ములును జన్నెదారి సూచి,
పట్టఁగా రానికోపంబు ప్రజ్వరిల్ల,
నొక్కమంటగ మండె నయ్యుగ్రమృగము. 97

వ. గొలుసులు కట్టిపెట్టియును,
గొట్టియుఁ, దిట్టియు, బాధ పెట్టియున్,
వలచినతిండి పెట్ట కుప
వాసము పెట్టియు, నిన్నపంజరం
బులఁ జెఱపెట్టి యున్నపులి
మోమును జూచిన గొప్ప కాదు, వి
చ్చలవిడి కానలోఁ దిరుగు
జంతువుఁ జూచినఁ దెల్ల మయ్యెడున్. 98

చ. వనమున, నందులోనఁ బరి
పంథిమృగాకులఘోరమధ్యకా
ననమున, రేఁపఁబడ్డపులి
నాడెము, కన్నులఁ జూచి కాని, వ
ర్ణనముల బోధ కాఁగలదె?
ప్రౌఢకవీంద్రుఁడె చెప్పెనేనియున్;
వనజదళాక్షి! నీ వెఱుఁగ
వా? పులిచేఁతలు దానిక్రౌర్యమున్. 99

చ. ఘననిబిడప్రకోపజన
కం బగుతండ్రివధక్రమంబు, రే
చినరుష, వహ్నిమాడ్కి ముఖ
సీమ వెలుంగఁగ, రప్పురప్పునా

ధ్వని యతిభీతిఁ గొల్ప, బహు
ఘాటి, హుటాహుటి, వ్యాఘ్రశాబకం,
బనుపమవిక్రమంబున వి
హారము సేసెఁ జలంబు పేర్కొనన్. 1

వ. తెఱచిననోటఁ బెన్నురుగు
తిట్టలు తిట్టలు రాల, నేచి, బి
ట్టుఱుముచుఁ, జెట్టుచెట్టును ర
యోద్ధతి రొప్పుచు, నీరమీరముల్
చెఱుచుచు, డొంకడొంకలును
జీల్చుచు, వ్యాఘ్రకిశోర మావనిం
దిరిగెఁ బిశాచి పూనినదొ
దీనికి నాఁ బ్రజ శంక సేయఁగన్. 1

ఉ. చిక్కిన నొక్కవ్రేటున నె
చీల్చి గుటుక్కని మ్రింగుకాంక్ష, న
ల్దిక్కులఁ బేరెముల్ పఱచి,
దీవన మొప్ప, నృపాలుమాటుది
క్కక్కఱ మైనధాటిఁ గల
యం బడవచ్చెదువ్యాఘ్రపోతముం,
బ్రక్కన చూచి ముష్టిపలి
వంశకరీరము వేసె నుద్ధతిన్. 1

శా. ఆవ్రేటుం గొని లెక్క సేయ కది క్రో
ధాభీలగర్జార్భటీ
ప్రావృట్కాలఘనాఘనస్తనిత మై,
బాఢోజ్జ్వలద్దీపికా



35. దాన శాంతించి కన్నులుఁ దాఁచుకొనుచుఁ
జేయుఁ డెద్దేని నింకనాఁ చేష్ట దక్కె,
జనయిత ఋణంబు దీరె నేఁ గృతుఁడనుచు దీర్ఘ
నిద్ర నిద్రించెఁ బులిపిల్లఁ గావ్ర మిఁగి.

క్షోపహితాసనంబు డిగె

నుద్ధతి మాని పరున్న ధీర్ఘని

ద్రాపర మైనవ్యాఘ్రమును,

దచ్చిశువుల్ వెఱఁగంది చూడఁగన్. 107

సీ. సంతోషభరితులై సహజన్ము లేతేరఁ

జిఱునవ్వుతో వారిఁ జేరఁదీసి,

సార్థక మాయె మాశ్రమ మంచు బేదులా

సాహేబు రాఁ దనకేసరనఁ జేర్చి,

నిండె మాకోర్కులు నేఁ డంచు వచ్చురం

గారెడ్డికిఁ గరలాఘవ మొసంగి,

యత్యాప్తితో నృసింహారెడ్డి యరుదేర

నాయనతోఁ బరిహాస మాడి,

గీ. నగుచు వచ్చులతన్నెరెడ్డి మిగులఁ బొగడి,

రామచంద్రనృపాలు మర్యాద సేసి,

చిత్రచిత్రంబులుగను తస్వీర్లు తీయఁ

జేసి, భూపాలకుం డాజ్ఞ సేసె నిట్లు. 108

క. పుడమికి రాజెట్టులో యీ

యడవికి నివి యట్లు గాన నామర్యాదల్

నడపవలెఁ గాని వీనిం

జెడఁజూచుట రాజవిధినిషిద్ధము కాదే? 109

ఉ. ఏనుఁగుమీఁద, వీనిని స

మోహితవైభవ మొప్పఁ బెట్టి, స

మ్మానన మెలర్ప, ఢోలకఢ

మామికఢక్కహుఢుక్కఢంఢమ



37. యే,
న్గునుగయి సేసి దానిపయి గొబ్బునబెబ్బులు లుంచి తూర్య ని,
స్వనములు మిన్నుముట్టఁగ స వారుల వీడు మరల్చి రేపునన్.

ధ్వానసమగ్రపౌరజన
తావినుతోత్సవభాసమానసం
ధానముతోడఁ జేకొని చ
నం బగు పీటికిఁ బుష్పవాటికిన్. 110

చ. అని సెల విచ్చునంతటనె,
యయ్యెడ, నయ్యెడ నున్నయాత్మకూ
రనుపుర మేలుమేలుమరి
యాదహాజీరుఁడు తెచ్చి యున్నయే
న్గును గయిసేసి, దానిపయి
గొబ్బున బెబ్బులు లుంచి, తూర్యని
స్వనములు మిన్ను ముట్టఁగ స
వారులు వీడు మరల్చి రేపునన్. 111

ఉ. "చెప్పితి నిన్న యే జయము
సేకుఱు నేఁ డని నీకుఁ, జెప్పిన
ట్లిప్పుడు సెల్లెఁ జెల్లియును
నించుక యేనిఁ గృతజ్ఞతావిధుల్
చొప్పడఁ బల్కరించ విది
చోద్యము రాజులనీతి" యంచు నే
రొప్పఁగఁ బల్కి పశ్చిమమ
హోదధి భానుఁడు సేరె నంతటన్. 112

చ. "స్థిరమతి స్వీయధర్మము ప్ర
తిష్ఠిత మానటు వ్యాఘ్రరాజు నీ
వరుస బహూకరించుపరి
పాటి వెలింగియుఁ, గర్మసాక్షి భూ

వరు నుఱి కిట్టు లాడఁ దగ
వా?" యని మేఘుఁ డమోఘధర్మత
త్వరతఁ దుషారవృష్టి నృపు
పైఁ గురిసెన్; ఘనమార్గగామి యై. 11

ఉ. అంత ననంతవైభవస
మగ్రమహోత్సవలీలఁ దేలి, భూ
కాంతుఁడు సర్వసైనికని
కాయముతో శిబిరంబు సేరి, సా
మంతసహోదరాప్తగురు
మంత్రిపురోహితబంధుభృత్యకా
ర్తాంతికవార్తవాహజన
తాసుఖగోష్ఠి యొనంగు చున్నెడన్. 114

ఉ. "పెంచిన లేడిపిల్ల కిటు
భీతి దొలంగఁగఁ జేసి మేలు కా
వించితి వయ్య, జానపద
బృందము సంతస మందె నయ్య, శి
క్షించితి వయ్య బెబ్బులుల,
సేమ మొసంగితి వయ్య", యంచు దీ
వించుచు వచ్చినట్లు ప్రభ
వించె సుధాకరమూర్తి తూర్పునన్. 115

సీ. పేర్వాసిగాఁ గాందవికు లొనర్చినమంచి
షాడబోపేతభోజ్యములవలనఁ,
బరిమళద్రవ్యసంభరిత మై గుమగుమ
లాడుకప్రంపువీడ్యములవలన,

గాయనగాయనీకమనీయగాంధర్వ
రమ్యనాట్యప్రచారములవలనఁ,
బండితకవిసార్వభౌమవాచాప్రౌఢిఁ
గండళించెడుప్రసంగములవలన,
గీ. నిండి నిబిరీస మయినచంద్రికలవలన,
లలితమలయానిలప్రచారలనమువలనఁ,
గలితశయ్యోపధానభోగములవలన,
రాత్రి చనె రాజునకుఁ బ్రజాప్రాతమునకు. 116

చ. "చెదరినజంతువుల్ మరలఁ
జేరి యరణ్యమునందు నిర్భయం
బొదవఁగ సంచరించుటకు
నొక్కటి రెండు దినంబు లుండి యా
పిదపఁ బునఃప్రయత్నమును
వీలుగఁ జేయుద మింతలోన నా
ల్గుదెసలఁ బోతులం బనిచి
కొం" డని భూవరుఁ డాన తిచ్చినన్. 117

శా. "అల్లారే! యిది మంచిమాట వహావా!
అచ్ఛా!! సలా" మంచు బే
దుల్లాసాహెబు మెచ్చుకొం చితరయో
ధుల్ దోడ్పడన్ మ్లేచ్ఛవా
క్కల్లోలుం డయి, వెంటనే యరిగి, రం
గారెడ్డితోఁ జేరి, గా
ఢోల్లాసంబున ముందుకార్యమున కు
ద్యోగించె, నత్యాస్థతోన్. 118

గీ. దిన మొకటి యేఁగె, రెండవదినము సనియె,
మఱియుఁ దార్తీయదినమును నరిగె, నెట్టి
వింతవార్తలు లేవాయె, నంత నాల్గ
వదివసము వచ్చె, వచ్చెఁ, బ్రభాతవేళ. 119

సీ. "ఉపమావ్వు టీ కాపియును రోటిబిస్కత్తు
లఁటు!" యిది యెచటియాహార మొక్కొ?
"కప్పు సాసరు ప్లేటు కమలాంగులఁటు"! వింత
బాస యిదేనాటిబాసయొక్కొ?
"పంట్లాము బూట్సు షేర్వాని టోపీలంటు!"
తెలియ వి దెచటిముస్తీబులొక్కొ?
తలలు బోడులు జుత్తుపిలకలే కనరావు
వీ రేవిలాతులవారలొక్కొ?

గీ. భరతఖండంబొ? కాదొక్కొ? మఱచినాఁడ,
నను చనూరుఁడు దృఢనిశ్చయంబు సేసి
కొనఁగ డాకంటు నిడినదుర్భిణి యనఁగఁ,
బొడుపుగుబ్బలిఁ దొలితొలిప్రొద్దు పొడిచె. 120

గీ. పుడమిగొల్లది సభ మనుముదవుఁ దెచ్చి,
పొడుపుగుబ్బలిలేదూడ విడిచి, ప్రొద్దు
పొదుఁగుఁ బిదికినసురుగు పెంపొదవుపాల
దార లివి నా మయూఖకందళము లెసఁగె. 121

గీ. ప్రాచిఁ బొడిచెడుప్రొద్దుతో లేచి, ప్రాఁచి
పనులు దీర్చెదునవరజపద్మముఖుల
చేతిగాజులయులివులచేత లేచి
పాఁడిపసువులు చేఁపె నంభారవముల. 12

గీ. పడఁతు లొసఁగినచలిదియం బళ్ళు ద్రావి,
కాఁడిమోఁకులు మూఁపులఁ గ్రాలఁ, బనులఁ
జిల్లకోలలఁ దడవుచుఁ, జేలవంక,
సాఁగి నడచిరి కాఁపుసంసారు లపుడు. 123

గీ. ఒడిసెలలు ద్రిప్పు చొయ్యార మొఱపు నెఱప,
నెత్తుమంచెలపై నెక్కి యెలుఁగు లెత్తి,
శాలికాపాలికాబాలికాళి పాడు
పాట లామ్రేడితంబు లై పరఁగె దెసల. 124

సీ. చంపకమాలికాసౌరభ్యభరిత మై,
చంచరీకావళీస్థగిత మగుచు;
వనమయూరవిచిత్రవర్ణసంకీర్ణ మై,
యాత్తభుజంగప్రయాత మగుచు;
శార్దూలవృత్తప్రచారదంతురిత మై,
హరిణీవిహారయోగ్యంబు నగుచు;
మత్తేభగౌరవమాన్య మై, మంజులో
త్పలమధుమాధురీభవ్య మగుచు;
గీ. శిబిర మొప్పారెఁ, గౌముదీశేష మయ్యు,
భవ్యమలయానిలాంచత్ప్రభాత మగుచు,
నుదయరాగంబు నుదయురాగోత్థగీత
బోధితాఖిలకవిరాజపుంజితముగ. 125

మ. భవపాథోధికిఁ బోత మై, బహుసుఖా
వాసంబు నై, యబ్జసం
భవముఖ్యామరసేవ్య మై, తనరుయు
ష్మత్సత్కథల్, గాయకుల్

శ్రవణానందముగాఁ బఠింప విని, కృ
ష్ణా! శ్రీహరీ! లోకబాం
ధవ! మాం పాహి య టంచు మేలుకొనె, మూ
ర్ధన్యుండు శ్రద్ధాళుఁ డై. 126

సీ. సక్రమంబుగ స్నానజపతపోదేవభూ
దేవసేవావిధుల్ దీర్చి, వీట
నందఱసేమంబు లరసి, యెల్లరకామి
తంబు లెల్ల యథోచితముగ నొసఁగి,
బందుగుల్ గలసి సాంబంతిగా బోసేసి,
సేవకు లొసఁగుముస్తీబు దాల్చి,
హెగ్గడికత్తియ యిచ్చువీడ్యము వేసి,
రతనాలకత్తి కరమునఁ బట్టి,

గీ. చోబుదార్లు నకీబు లస్తోకలీలఁ
బ్రబలభయదార్భటుల బరాబరులు దెల్ప,
రాజపంచాననుఁడు, 'మహారాజబిరుదు'
సార్థకంబుగ వచ్చె, నాస్థానమునకు. 127

గీ. వచ్చి "యే మయ్యె మనవేఁటవార్త," యనుడు;
సాగి నిలచి యుబేదులాసాహె బప్పు,
డచట నున్నట్టికర్షకు నభిముఖునిఁగఁ
జేయ, నతఁ డిట్టు లనియె నాక్షితివరునకు. 128

సీ. "ఏమి సెప్పుదు సామి యిల్లు పొల్లుగఁ జేసి
యేనూర్లకుం గొన్నయెద్దుఁ గొట్టె,
మొన్న మొన్ననె యొక్కముదుసలికరణంబు
బండిపై నేఁగుచోఁ బట్టి మ్రింగె,

బోగఁపుదానియాఁకొబోతు బూతమువంటి
దానిఁ బెల్లేసి హాతంబుసేసె,
నూరిలో నింకను నున్నట్టికాఁపుల
కాఁడియె డ్లెన్నేనిఁ గాసిసేసె,

గీ. సాఁగనీదయ్య! దారి, పిశాసమట్లు,
మెకము గాదయ్య, యది మాకు మిత్తి గాని,
దేవరా! దానిఁ జంపినఁ దీఱు మాకుఁ
గస్తి యంతయుఁ బున్నెంబు కలుఁగు మీకు.'' 129

మ. అని దీనుం డయి కాఁపు వల్కుటయుఁ, "గ
ట్టా! యిట్టియిక్కట్టు వ
చ్చెనె? మీ కాభయ మింక నేల? చని వి
చ్ఛేదంబు గావింతు నీ
దిన మాఘాతుకజాతి'' నంచు, నపుడే
తే రెక్కి పైనంబు సే
సిన, సర్దారులు వేఁటకాండ్రును సము
త్సేకంబు దీపింపఁ గాన్. 130

చ. తమతమవారితోఁ గలసి,
తత్క్షణమే పురి క్రొక్కారోసుదూ
రమున, నెసంగు దట్టపుట
రణ్యమునం, బులి వచ్చుత్రోవ, వృ
క్షముపయి, మాటుమర్చి పతి
జాడ నిరీక్షణ సేయుచో, శతాం
గముపయి వచ్చి మాటును స
కారున్నకుఁ డై విభుఁ డెక్కెఁ జెచ్చెరన్. 131

సీ. జ్యేష్ఠభావుకుఁడు రాజేశ్వరరాయప్ప
క్ష్మావల్లభుండు హంసవీరుఁ డతఁడు,
తత్సోదరుఁడు తాణిదళవాయి రామచం
ద్రాహ్వయుం డతఁ డసహాయశూరుఁ,
డాప్తమిత్రుఁడు నృసింహారెడ్డి మంచిప
రాక్రమశాలి దోర్బలయుతుండు,
ప్రబలబలుండు ధర్మారెడ్డిదేశపాం
డ్యుఁడు మృగవ్యాసక్తి యున్నవాఁడు,
గీ. వీర లందఱు భూవరువెంట వచ్చి,
వారివారికి నేర్పడ్డభూరుహముల
మాటులందు వసించి, యాఖేటసక్త
చిత్తులై యుండి రంత భ్రాజిష్ణు లగుచు. 132

క. తమ్ముఁడు శేషారెడ్డియుఁ
దిమ్మారెడ్డియును వారి తేరులపై శీ
ఘ్రమ్మున నరుదెంచి వికా
స మ్మెసలారెడుముఖాంబుజాతమ్ములతోన్. 133

క. ఆదాపుననే యొండొక
పాదపమున నధివసించి వఱలిరి; తాలూ
కాదారుఁడు సర్దారుఁడు
బేదులసాహేబు వచ్చి వీ డంతయునున్. 134

ఉ. "సాహస మొప్ప నందఱు హు
సారయి యుండుఁ" డటంచు, సాటి, తా
నోహరిసాహరిన్ మృగయు
లుద్ధతి ముందు చనంగ, వారి కు

త్సాహముఁ బెంచుచుం, దవిలి
సత్త్వములన్ వెసఁ జోఁప లుబ్ధసం
దోహముఁ జూచి, "వేగమ ప
దుం" డని, వారికిఁ జేయి వీచినన్. 135

క. గొల్లున నభోంతరాళము
భిల్లుకభయకృన్నినాదపిహితం బయ్యెన్,
భల్లుకముఖమృగచేతో
భల్లంబులపగిదిఁ బటుహాభాంకృతు లెసఁగెన్. 136

సీ. మత్తశుండాలశుంభద్బృంహితార్భటీ
పిండితం బయ్యె భూమండలంబు,
ఘోరతుపాకికాగోళకోత్థవిరావ
ఖండితం బయ్యె బ్రహ్మాండవితతి,
పటహాతమ్మటముఖ్యవాద్యభాంకారపి
చండ మాయెను వియద్భాండకుహర,
మాటవికోగ్రోద్భటాట్టహాసధ్వాన
హిండితం బయ్యె దిక్కాండ మెల్లఁ,
గీ. గొండలును గుండలును గుండపిండి యయ్యె,
నీఱములుఁ దీరములు చూరుచూరులయ్యెఁ,
బరవలును దెరువులుఁ బటాపంచ లయ్యె,
నల్లకల్లోల మయ్యెఁ బేరడవి యెల్ల. 137

చ. కలుగులు డొంకలుం బొదలు
కందరముల్ మొదలైనయున్కిప
ట్టులు దిగనాడి, వే పఱచెఁ,
డోకులుటోకులుగా, వఱిళ్ళు, జిం

కలు, కడుఁజుల్, సివంగులును,
గాజెనుపోతులు, దుప్పి, లేదుఁబం
దులు, మనుఁబోతు, లెల్గులును,
దోడేలులుం, జిఱుతల్, వరాహముల్. 138

చ. హరిణముఁ గాంచి చిందుగఁ భ
యానఁ బలాయన మౌట, నక్కపో
తరసి తరక్షుకంబు వెగ
డందుట, బెబ్బులి దుప్పి సూచి వే
పఱచుట, కాఱుపిల్లిఁ గని
పంది యదావద లౌట, యెన్నఁ డెం
డెఱుఁగని వైపరీత్యములు
దృక్పథగోచర మయ్యె, నావనిన్. 139

క. అఱవఱలును, దుత్తుమురులు,
మురియలుమురియలును, ముక్కముక్కలు, చిద్రుపల్,
పఱియలుపఱియలు, నై వెం
పఱయెం, బేరడవి వేఁటకయఱిముఱికతనన్. 140

గీ. ఈహాళాహాళి యొకయింతకయేనిఁ జెవులఁ
బెట్ట కాచండచండకం క బట్టె సోలి
లెస్స నిద్రించినిద్రించి క లేచెఁ గొనకుఁ
బర్యుషితమాంసభక్షణకవాంఛఁ జేసి. 141

గీ. ఒడలు జాడించి, లేచి, దకవుడులు దులిపి,
నిక్కి, నీలిగి, తలయును క నిడుదతోఁక
సాఁచి, యుజ్జృంత లూఁగి, మీఁకసాలు నోరు
దుడిచికొని యావులించుచు క వెడలె మెకము. 142

సీ. త్రుప్పు డంతయును బోకత్తుగ రాలి వెలిసిన
చారలు గలమేనిచాయతోడ,
నరులనంజుళ్ళ నంతము లేక తినుటచే
వాటు మేదినబోసినోటితోడ,
వంచనచే జంతువర్గంబు హింసింప
మగతన మఱినట్టిమొగముతోడఁ,
బాపఁపుసరకు కావడి మోసిమోసి యా
ర్జించి పెంచినజబ్బచేవతోడ,
గీ. వంకచాటున కలవాటుపడినముచ్చు
పగిది నేమంబు లేనియడుగులతోడ,
నటమటించుచు విచ్చేసె వ్యాఘ్రరాజు,
చెంగుచెంగున నాఖేటరంగమునకు. 143

సీ. త్రాగుడు మఱిగి నిందాపాత్రుఁడై పాన
భవన మేఁగెడుపాఱువానిపగిది,
నన్యాంగనాలింగనాసక్తిఁ దలఁకొని
బయలుదేఱినరాచవానిభంగిఁ,
గూటసాక్ష్యము కొని కొంపలు దీయ నా
స్థాన మేఁగెడుబచ్చువానిపోల్కి,
స్వామ్యర్థ మెగఁబెట్టి స్వగృహంబు నించి వి
శ్వాస మేదినకాపువానిరీతిఁ,
గీ. గనఁబడియుఁ గానకుండ దుర్గంధ మెనసి,
మాఱువేసంబుతోఁ జాటుమాటు వడుచు,
దొంగచూపులు, ధూర్తత్వదోషగరిమ,
బయలువడ వచ్చె, వచ్చె, మువ్వన్నె మెకము. 144

ఉ. వచ్చిన యాపులిం గని తు
పాకులు బారులు సేసి యందఱున్,
హెచ్చరి కొప్ప నొండొరువు
లేయుటకుం దఱి సూచు చుండఁగాఁ,
గ్రచ్చఱ భూమిపాలుఁ డొడి
కంబున వేసెఁ దుపాకి, దానిగుం
డచ్చుగ దానిడొక్క వల
యాకృతిఁ జొచ్చెఁ, గఠోరతాంకృతిన్. 1

గీ. దానఁ దత్క్షణ మది చావకేఁ దగిన దయ్యు,
మొండిప్రాణం బగుట రెండుమూఁడు బార,
లవలకున్ దాఁటి, నిలువెత్తు చవుకళించి,
యెగిరిపడి, యూగ్లై, దద్బల మేమొకాని! 14

చ. "జయజయ! రామభూపసుత!
చాఁగు! బళాబళీ! బాపురే! వహ
వ్వా!" యనుప్రశంసనాదము ల
వారిగ నాలుగుదిక్కులన్ మహో
చ్ఛ్రయముగఁ బర్వె, భూవిభుఁడు
సంతస మంది, భవత్పదారవిం
దయుగళిసేవ యిందులవు
నాదిగఁ గైకొనె, నిన్ను నెన్నుచున్. 14

సీ. ఆంధ్రబిడ్డలతోడ నతినిర్భయంబుగాఁ
బొదలఁ జరించునిం పొదవె మాకు,
దేవుఁ డిచ్చినమేఁత దిని మాకులపతితో
విహరించుస్వేచ్ఛ లభించె మాకుఁ,



48. దానఁదత్‌క్షణమది చావఁదగినదయ్యు, మొండిప్రాణంబగుట రెండు మూఁడుబార లవలకుఁదాఁటి నిలువెత్తి చవుకళించి, యెగిరిపడి యీాలెఁ దదాల మేమొకాని

గందమూలముల నాఁకలి దీర్చుకొని నెల
వుల సుఖమ్ముగ నుండఁగలిగె మాకు,
నాకలంబులు మేసి యడవిలోఁ బాలకం
బలఁ గూడి నివసింపఁగలిగె మాకు,
మాయుసురు పోసికొని మేనుమఱచి యున్న
క్రూరుఁ డయినట్టి యధికారిఁ గూల్చి మమ్ము
రక్షణము సేసె గద్వాలరాజ టంచుఁ
బొగడె వేనోళ్ళ విభు సాధుమృగము లెల్ల. 150
తనబాగె కాని యితరులబాధ యెఱుంగ
నట్టిరాజును రాజె యనియె శశము,
సాధులయొడలిమాంసముచేత జీవించు
నట్టితేఁడును తేఁడె యనియె లేడి,
పుట్టుట బీదలఁబట్టి చంపుట కను
నట్టిదొర దొరయె యనియె దుప్పి,
తనబలంబు గరీబులను గిట్టుటకె యను
దణి యొక్కదణియె యం చనియె గొఱియ,
పరులకష్టసుఖంబులపాటి యెఱఁగి
దుష్టులను శిక్షసేయుచు శిష్టరక్ష
ణమునఁ గ్రాలెడు గద్వాలనాథుఁ డవని
నాథుఁ డవుఁ గా కనె మృగగణంబు లెల్ల. 151
శిశువులఁ జంకలం దిడి కృ
షీవలకాంతలు చారునాసికాం
తశయితతర్జనీప్రచురి
తం బగునివ్వెఱ దోఁపఁ జిత్రకా

యశవముఁ జూచి పార్థివుని
రంకుశశౌర్యము మెచ్చి రుల్లల
ద్దశనఘృణీగుణీకృతశి
తచ్ఛవిహాసముఖాంబుజాత లై. 152

శా. ఈమాడ్కిన్ నరులున్ మృగంబులును నెం
తేఁబ్రీతి శ్లాఘింపఁగా
శ్రీమంతుం డుచితానులాపముల వా
రిం దేల్చి యావద్దిశా
క్రామత్తూర్యనినాదముల్ సెలఁగ వ్యా
ఘ్రుం బేనుఁ గెక్కించి య
త్యామోదమ్మున వీటికై వెడలె సై
న్యంబుల్ దనుం గొల్వఁగన్. 153

సీ. మనుజులలో నిట్టి మనుజాశనులు లేరె
మాట లే లని యాడు దీఁటెఁ జిఱుత,
పరులబాధలతోడ పని యేమి మా కని
పాటి సేయక కన్ను గీఁటెఁ జిందు,
గివి యన్ని సూచిన నెట్లు మాజీవనం
బనుచుఁ దోఁడేలు తోఁకను విదిర్చె,
బల మున్నవార లే బ్రదుకుట లెస్సంచు
మొగ మెత్తి గట్టిగా మొఱఁగె నక్క,

గీ. అట్టులే యైన మీ కున్న దనుభవంబు
నచిరకాలంబులో నని యరిగె నెల్ల
సాధుమృగములు గద్వాల సార్వభౌమ
నామమంత్రపురశ్చరణమునఁ బొదలి. 15

సీ. ఇనుఁ డను పేర్వాసి యెనయుట యే కాని
యెట్టిసంస్థాన మే నేలనైతి,
సన్మార్గమును బట్టి సంచరించుటె కాని
సద్రక్షణంబును జరపనైతి,
మందేహరాక్షసు మాఱ్కొనుటె కాని
యీనాఁటికిని సమయింపనైతిఁ,
బుట్టుట మఱియును బొలియుట యే కాని
యేకార్యమును జేసి యెఱుఁగనైతి,
గీ. సార్థకాహ్వయ మొప్ప సంస్థాన మేలి,
సాధురక్షణ దుష్టశిక్షణయుఁ గార్య
కర్తృత యెసంగఁ గ్రాలె నీకర్త యనుచుఁ
జిత్రభానుండు చరమాద్రిఁ జిన్నవోయె. 155

క. పరిపరి వినోదముల సుఖ
కరముగ నారాత్రి యంత గడచనె నతినుం
దరతరభాస్కరకరనఖ
పరిచితి నని నగుచు నలరెఁ బద్మిను లెలమిన్. 155

మ. ప్రియులుం దాము సుఖోపవిష్టులయి ని
ర్వ్యాలాంగజాతాగమా
ధ్యయనోత్తేజితచిత్తులై యలరుచో
నబ్జప్రియుం డంతరా
యయథాజాతమహాపరాధకలితుం
డై వచ్చె నంచుం గుశే
శయసద్మప్రఘణాళి ఝుమ్ము రనెఁ జం
చచ్చంచరీకావళుల్. 156

ఉ. "అప్పులు తీసికోఁగలిగి
యందలివృద్ధియునేని నీయ వే
మప్ప! సరే యి చ్చైన వ్యవ
హారము లె" ట్లని ఖండితంబుగాఁ
జెప్పెడువార్ధులం గని "ప్ర
చేతసుఁ డిచ్చినయప్డు దీర్తు మీ
యప్పులు పొం"డ టంచు రవి
హాంకృతి వేంద్రమము సూపె నత్తటిన్. 158

చ. మొదటిదినంబు కన్మొఱఁగి
పోయినబెబ్బులి యేమికారణం
బొదవెనో కాని చచ్చి పడి
యుండినఁ దెచ్చిరి వేఁటబోయ ల
య్యదియును జేర్చి నాల్గుపులు
లాయెను గావున నూరి కింకఁ బో
వుద మని యాజ్ఞ యిచ్చె నృప
పుంగవుఁడుం బయనంబు సేయుచున్. 159

సీ. ఆత్మకూ రను నూరి కధిపతి దేశపాం
డ్యుఁడు భాగ్యవంతుండు యోగ్యతముఁడు,
మంచి గేస్తుండు ధర్మారెడ్డి గద్వాల
విభునియొద్దకు వచ్చి వినయ మెసఁగఁ,
దనభవనంబు పావనము సేయఁగఁ గోరి
స్వాగతం బిడిన సర్వార్థిప్రేమ,
నంగీకరించి సర్వాంగసేనలతోడ
సపరివారంబుగాఁ జని తదీయ

గీ. సురుచిరావాసమునను దద్వారచితోప
చారములఁ దృష్టి వడసి ప్రసన్నుఁ డగుచు
నతనిఁ గొనియాడి విభుఁడు మర్యాద లెసఁగ
వీడుకొని భాగ్యనగరంబు వేడ్కఁ జేరె. 160

సీ. పచ్చకప్రంపుఁగమ్మపలుకులచలువతోఁ
గడుపుచల్లఁదనంబు కవలు వైవ,
ముక్కుముక్కరము త్తెములపోహణములతో
ముసిముసినవ్వులు ముచ్చటింప,
ముంజేతికంకణంబులచిన్నిరొదలతో
నలిచేతితాళంబు లనుకరింపఁ,
జిబుకంబుఁ జేర్చినచేతిచూపుడుప్రేలు
నద్భుతరసముతో హాస్య మాడ,
గీ. జననియును, రాజ్ఞియును, దనూజాత, భగిని,
వేఁటకథ లాలకించి నివ్వెఱపడంగ
రాణివాసంబుఁ జేరి నిరంతరాయ
సౌఖ్యములఁ దేలె విభుఁడు విశ్రాంతి యెసఁగ. 161

-----*-----

మాలిని. నిరుపమగుణధామా! నిర్మలానందసీమా!
సురపతిముఖదేవస్తోత్రపాత్రప్రభావా!
దురితతిమిరసంఘోత్తుంగదీప్యత్పతంగా!
నరకదమనదక్షా! నాగరాజేంద్రరక్షా! 162

-----*-----

మ. ఇది గద్వాలనృపాలచంద్రమృగయా
వృత్తాంతముం దెల్పునో

54 – 1

369 ప్పద మాచిన్ని తెనుంగుఁగబ్బము, సుధీ
బృందంబు దీనిఁ రసా

స్పద మా...

ధ్భుదయుఁ నన్ను... గ భాషానిలయమ
ప్రీతాత్ముఁ గావించుతన్. 16

ఆశ్వాసాంతము.

మ. ఇది శ్రీమత్పర దేవతావరకృపా
హేవాకసంలబ్ధభా
స్వదుదంచత్కవితావిభాసురుఁడు గ
ద్వాలక్ష్మాపాలద
త్తదుకూలాదిక హేమరత్నమయమా
ద్యద్భూషణోద్భాసి యౌ
ప్పిద మానట్లు ప్రభాకరాఖ్యకవి గా
వించెఁ సుహృత్ప్రీతిగాన్.

సమాప్తము.





Printed at the Ananda Press, Madras—1924